# జమీన్ రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 59 సంచిక: 3
15-1-1988
శుక్రవారం
8 పేజీలు రూపాయలు

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు • • • మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# అసెంబ్లీ రద్దుకు ఆలోచనలు?

అర్ధరాత్రి ఉత్సవాలు 9 తేది దిగ్వి జయం పొందించడంతో, తెలుగుదేశం పార్టీలో విశ్రాంత విశ్వాసం పెరిగిపో యాయి. శ్రీనివాసులురెడ్డి రభస హైకోర్టు తీర్పు, తదితరాలవల్ల కలవరపడివుండిన వారంతా గండం గట్టెక్కినట్లే భావిస్తు న్నారు. అర్ధరాత్రి ఉత్సవంతో హైకోర్టు తీర్పువల్ల తగిన మచ్చ మాసిపోయిందని;

## హైదరాబాదు వృత్తాంతం

ఎవరెన్ని చెప్పినా అనుకోట్ల ఆంధ్రులలో ఎన్టీఆర్ గ్లామర్ ఏమాత్రం తగ్గలేదని, ఈ ఉత్సవానికి హాజరైన అశేష జన సందోహాన్ని చూసినతర్వాత ప్రతిపక్షాలు, ముఖ్యంగా సి పి ఐ వంటి 'మిత్ర శత్రు' పక్షాలు రామారావు రాజీనామాకోరడంపై పునరాలోచనలో పడతారని తెలుగుదేశం నాయకులు భావిస్తున్నారు.

ముఖ్యమంత్రి, చంద్రబాబు ఈ విషయంలో మరీ ధైర్యంగా వున్నారు. రెండు నెలల క్రితం రాష్ట్రంలో రాజకీయ సంక్షోభం ప్రారంభమైనప్పటినుంచి రామారావు ఎమ్మెల్యేలంటే హడలి పోతుండివారు శ్రీనివాసులురెడ్డి మాటల మాయలోపడి వారెక్కడ జారిపోతారో ననే భయం ఆయన్ను పీడించింది. దాంతో తగినట్లే తెలుగుదేశంపార్టీ సమావేశా లలో ఎమ్మెల్యేలు, ఎం. పీలు మొదటి సారిగా నోరువిప్పి మాట్లాడారు. ఈలోగా కోర్టు తీర్పు వచ్చిపడింది. మిత్రపక్షాలే శత్రుపక్షాలుగా మారాయి. అవినీతి ఆరో పణల ముసురు ఒళ్ళంతా పేరుకొనిపోయి, ప్రజలలో తల ఎత్తుకొని తిరిగే మానసిక ధైర్యం కోల్పోవలసివచ్చింది.

ఈ ప్రతికూలతలన్నీ ఒక్క రోజు ఉత్సవంతో తుడిచిపెట్టుకొని పోయా యని ఇప్పుడు ఎన్టీఆర్ భావిస్తున్నారు. జనవరి 9 తేది ఉత్సవానికి తెలుగుదేశం నాయకులు ఊహించిన దానికంటే అధిక సంఖ్యలో జనం వచ్చారు. పరిస్థితులు క్లిష్టంగా వున్న ఈ దశలో తను ఆరే ళ్ళన్ని మన్నించి జిల్లా కమిటీలు జన సమీకరణ చేస్తాయా అన్న సందేహం వీరిలో కన్పించింది. కాని వచ్చిన జనాన్ని చూసిన తర్వాత అనుమానా లన్నీ పటాపంచలైపోయాయి. నాయకులు ఆనందం పట్టలేక గంతులు వేశారు.

ప్రతిపక్ష నాయకులుకూడా ఈ జనాన్ని చూసి ముగ్ధులైపోయారు. ఆ ఆవేశంలో తమ రాష్ట్ర యూనిట్ల ధోరణికి భిన్నంగా అందరూ ఎన్టీరామారావును ఆకాశానికెత్తి మాట్లాడారు. హైకోర్టు తీర్పును విమర్శిం చారు. జాతీయ రాజకీయాలలో అంతంత మాత్రంగా వుండిన ఎన్టీఆర్ అస్తిత్వం, ఈ బలప్రదర్శనతో బాగా బలం పుంజు కున్నది. ఒకవైపు ప్రతిపక్షాలను మాయ చేయగల్గడం; ఇంకొకప్రక్క పార్టీలోను, బయటగల విమర్శకులను ఆలోచనలో పడవేయగల్గడం అనే రెండు లక్ష్యాలను అర్ధరాత్రి ఉత్సవం నెరవేర్చింది.

ఈ నేపథ్యంలో తన స్థానాన్ని మరింత సుస్థిరంచేసుకోవడానికి, శాసన సభ రద్దుకు ఇదే మంచి తరుణమని ఎన్టీఆర్ భావిస్తున్నట్లు అంతరంగి కులు చెప్తున్నారు. హైకోర్టు తుదితీర్పు వచ్చేలోగా శాసన సభకు ఎన్నికలు జరి పితే, అందులో వారెన్ని వ్యాఖ్యలు చేసినా తనకువర్తించవనిచెప్పుకోవచ్చని; ఎన్ని కోర్టుతీర్పులు వెలువడినా ప్రజల తీర్పు తనకనుకూలంగా వుందని చాటు కునే అవకాశం లభిస్తుందని ఎన్టీఆర్ తలపోస్తున్నారట. ఈసారి ఎన్నికల్లో రాజకీయంగా బలీయమైన వర్గాలను ప్రక్కకునెట్టి, తనంటే పడిచచ్చే అభి మానులను ఎమ్మెల్యేలుగా గెలిపించు కుంటే, మిక్కిలి పేనులలా పడివుంటా రనేది ఆయన ఆశ.

ఈ ఆలోచనతోటే ఎన్టీఆర్ ఇప్పుడు వాగ్దానాల వర్షం కురిపిస్తున్నారని పరి శీలకుల అభిప్రాయం. గత రెండువారా లుగా ఆయన దగ్గరకు ఎవరువెళ్ళి ఏమి అడిగినా కాదనడంలేదు. ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి, బడ్జెటు, చట్టంలో సావకాశం, ఆచరణకు సాధ్యం వంటి అంశాలేవీ పరి గణించకుండానే వరాలుప్రసాదిస్తున్నారు. ఎన్నికల ఆలోచనే లేకుంటే, రాష్ట్ర ఆర్థిక పరిస్థితి అత్యంత క్లిష్ట దశలో వున్న ఈ రోజుల్లో ఆయన వీటిని ప్రక టించరని రాజకీయ పండితుల దృఢ విశ్వాసం.

కాళహస్తి, వాయల్పాడు ఉపఎన్ని కల ఫలితం వెలువడిన వెంటనే ఎన్టీఆర్ అసెంబ్లీ రద్దు విషయమై ఒక నిర్ణయానికి

*** ప్రజల తీర్పుకోరి హైకోర్టు తీర్పును ప్రతిఘటించాలనే పన్నాగం**

**★ అందుకోసమే వాగ్దానాల ప్రదానం**

రావచ్చు. వాయల్పాడుపై తెలుగుదేశానికి పెద్ద ఆశలులేవు. కాళహస్తినే వారు గట్టిగా నమ్ముతున్నారు. చంద్రబాబు నాయుడు స్వయంగా తిరుపతిలో మకాం వేసి లక్షలు కుమ్మరిస్తున్నారు. మంద

—కొరవ 8 వపేజీలో

# విశ్వవిఖ్యాత గణిత శాస్త్రవేత్త శ్రీనివాసరామానుజన్-నెల్లూరు

"శ్రీనివాస రామానుజన్" శతజయంతి సందర్భంగా, 'జమీన్‌రైతు' సంచిక (25-12-87) లో నెల్లూరుతో సంబంధం ఉన్నట్లు ప్రస్తావించారు.

"శ్రీనివాస రామానుజన్ కొంతకాలం మన కలెక్టర్ ఆఫీసులో మామూలు గుమాస్తాగా పనిచేశారట. అప్పుడు కలెక్టరు రామచంద్రరావుగారట. రామానుజన్ చేపట్టిన పతి ఫైల్లో ప్రతి కాగితంమీద మార్జిన్‌లో ఏవేవో లెక్కలు గీసిపెట్టేవారట. వాటిని అప్పుడు ఏదో పిచ్చి వ్రాతలనుకొని వుంటారు"

శ్రీ వాస్తు రామచంద్రగారు పై జమీన్‌రైతు సంచికలోనే 'జనవాణి' లో "శ్రీనివాస రామానుజన్ మన జిల్లా కలెక్టరు కార్యాలయంలో పనిచేసినందున - వీరి శతాబ్ది ఉత్సవం కలెక్టర్ ఆఫీసులో ఏర్పాటు చేయాలి" అని వ్రాశారు.

శ్రీనివాస రామానుజన్- నెల్లూరు కలెక్టరుగారి కార్యాలయంలో ఉద్యోగం-చేయలేదు. చేయవలసిన అవసరం రాలేదని, మనవిచేస్తూ- శ్రీనివాస రామానుజాన్ని- తొలిసారిగా "ఆర్. శైలస్" కలెక్టర్గా

కేంబ్రిడ్జి విద్యార్థిగా
శ్రీనివాస రామానుజన్

ప్రపంచ ప్రఖ్యాత గణిత శాస్త్రవేత్తగా పేరుగడించిన శ్రీనివాసరామానుజన్, అట్లా రూపొందడానికి ప్రాథమిక దశలో సహాయ సానుభూతులందించిన దివాన్ బహదూర్ శ్రీ ఆర్. రామచంద్రరావుగారు 85, 87, 89, 93 వ కలెక్టరుగా నెల్లూరుజిల్లాలో ఈక్రింది సంవత్సరాలలో పని చేసినట్లు తెలుస్తున్నది.

26-5-1911 నుండి 26-11-1911వరకు; 23-12-1911 నుండి 5-10-1912 వరకు; 6-11-1912 నుండి 9-5-1913 వరకు; 10-11-1913 నుండి 7-4-1917 వరకు.

శ్రీనివాస రామానుజన్ 1905 లో కుంభకోణం గవర్నమెంటు కాలేజీలో ఎఫ్. ఎ. చదువుతూ మధ్యలో విరమించుకొని, కొన్ని మాసాలు నెల్లూరు వచ్చి గడిపినట్లు తెలుస్తున్నది. ఆ కాలంలో (22-10-1904 నుండి 12-11-1906) నెల్లూరుజిల్లాకు 80 వ కలెక్టరుగా పనిచేసిన ఆర్. మోరిస్, శ్రీనివాసరామానుజనకు ఆశ్రయమిచ్చినాడో లేదో ఆ వివరాలు తెలియరావడంలేదు.

కుంభకోణం గవర్నమెంటు కాలేజీలో పనిచేసిన శ్రీ పి. వి. శేషు అయ్యర్, శ్రీనివాస రామానుజం గణిత ప్రజ్ఞను గుర్తించి, ఇండియన్ మేథమేటికల్ సొసైటీ అధ్యక్షుడుగాను, నెల్లూరుకలెక్టరుగాను పనిచేస్తున్న దివాన్ బహదూర్ ఆర్. రామచంద్రరావుగారి దగ్గరకు సిఫారసు లెటరు ఇచ్చిపంపారు. రామచంద్రరావుగారి అల్లుడైన కృష్ణారావుగారు స్వయంగా శ్రీనివాస రామానుజాన్ని కలెక్టరు రామచంద్రరావుగారికి పరిచయం చేసినవారిలో ఒకరు. 1911 లో శ్రీనివాస రామానుజన్ నెల్లూరు రావడం కలెక్టరుగారి కార్యాలయంలో 'గుమాస్తా' గా ఇవ్వమని అర్థించినప్పుడు- శ్రీ రామచంద్రరావుగారు ఆయన కోరికను తిరస్కరించడం జరిగింది. అయనవంటి అతీత గణిత శాస్త్ర మేధావిని, నెల్లూరు వంటి మారుమూల ప్రాంతంలో వుంచడం క్రూరమని భావించారేమో, ఆయనను మద్రాసు వెళ్ళమని పురమాయించారు. 1911లో కొన్నిమాసాలు వారికి అయ్యే ఖర్చు ఆయనే భరించారు. మద్రాసు ఇంజనీరింగ్ కాలేజీలో పనిచేస్తుండే సి. ఎల్. టి. గ్రిఫిత్‌ను, మద్రాసు పోర్టు ట్రస్టు ఛేర్మన్ సర్ ఫ్రాన్సిస్ స్ప్రింగును, మేనేజరు అయిన నారాయణ అయ్యర్‌ను, శ్రీని

—తరువాయి 10 వ పేజీలో

1911 లో నెల్లూరు కలెక్టరుగా
రామానుజన్‌కు సహాయపడిన
రామచంద్రరావు

### శ్రీ రామావఝుల శ్రీశైలం

చిన్నవాడు ప్రోత్సహించి, నేటింతగా ప్రపంచ వ్యాప్తంగా ఆయన గణిత విజ్ఞానిగా ప్రశస్తిగాంచడానికి ముఖ్య కారణభూతులు అలనాటి నెల్లూరు కలెక్టరు దివాన్ బహదూర్ ఆర్. రామచంద్రరావుగారేనన్న విషయం చెప్పదలచాను.

నెల్లూరు జిల్లా, కలెక్టర్ల పరిపాలన లోనికి రావడం, జులై 1790 లో ప్రభుత్వ స్వీకారం చేయడంతో ఆరంభమైంది. 1792 ఆగస్టులో కర్నాటకనవాబు జిల్లా పరిపాలనను అధీనంచేశారు. 1801 నుండి బ్రిటీషు పరిపాలనకు వచ్చింది.

నేడు నెల్లూరు జిల్లా కలెక్టరుగా పని చేస్తున్న డాక్టర్ ప్రశాంత మహాపాత్ర 170 వ కలెక్టరు.

## SALE PUBLICATION

IN THE COURT OF THE ADDL. DISTRICT JUDGE - NELLORE.

E. P. 32 of 86 O. S. 37 of 80

Between
The Manager, Union Bank of India, Nellore
Decree Holder

vs.

1) Basireddy Ramanareddy aged 52 years
2) Basireddy Seshureddy aged 48 years
3) Basireddy Sethuramireddy aged 45 year
All are sons of Narasareddy residing at Door No. 18 ward No. 2 Nawabpet, Nellore.
Judgement Debtors

The following property of Judgement Debtors will be sold for realisation of the Decree Debt by the Court at 10-30 A M on 21-1-88 In the above court. Persons interested to bid may participate in the above auction subject to the conditions of proclamation of sale

SCHEDULE

Nellore District Registration, Nellore sub registration, a Terraced house 32 Ankanams and vacent site 50 Ankanams in Nawab pet Nellore bearing Door No. 18 ward No. 2 bounded on.

East : House of Nerella Appa Rao
North : Kummari Street
West : House of Vinukota Venkatasubbaiah
South : Narukuru Road

Decree Holder's value Rs. 70,000/- only
Ameen's value Rs. 4,70,000/- only
Further hearing 28-1-88

C. PARAMKUSA RAO
Advocate for Decree Holder

## పినాకిని తీరం

### నిజాన్ని నిర్భయంగా చెప్పింది-"ఈనాడు"

అభిమానాన్ని అవతలపెట్టి నిజాన్ని నిర్భయంగాచెప్పినందుకు "ఈనాడు"ను దాని ప్రధాన సంపాదకుడు శ్రీ రామోజీ రావును అభినందించకుండా వుండలేకపోతున్నాను. "సంబరాల రాంబాబు" అంటూ 11 తేది ఈనాడు సంపాదకీయాన్ని ఎంతమంది పాఠకులు చదివి వుంటారోగాని; అద్భుతం అక్షర సత్యాలే. అక్షరలక్షలే! ఇది కొందరికి చేదుకావచ్చు; కాని అందరికి అమృతోపమానం కావలసిన వ్రాతలవి!

శ్రీ రామోజీరావు తెలుగుదేశాన్ని, దాని మహానాయకుడు శ్రీ రామారావును తన మూడు వ్యాసాల్లో ఎక్స్‌రే తీసారు: జరిగిన పొరపాట్లు ఎత్తిచూపారు: జరగవలసినదానికి సలహాలిచ్చారు. రామారావుగారు చేసినతప్పులు సరిదిద్దుకుంటారని, తన సలహాలు కొంతవరకైనా చెవినిపెడతాడని, పాపం, రామోజీరావుగారు ఆశించివుంటారు. 9 తేది మహానాడులో ముఖ్యమంత్రిగారి గంభీరోపన్యాసం ఆయన ఆశలను తలక్రిందులు చేసివుంటుంది, తీరని ఆశాభంగాన్ని కల్గించివుంటుంది. ఆ హృదయావేదన ప్రతిబింబమే ఈనాడు 11తేది సంపాదకీయమని నాఅభిప్రాయం.

తెలుగుదేశమంటే రామారావు ఒక్కడికాదు; రామారావు ముఖ్యమంత్రిగా అధికారంచెలాయిస్తున్నాడంటేఅదికేవలం ఆయనొక్కడి గొప్పతనంకాదు; తెలుగుదేశం అధికారానికిరావడానికి, రామారావు నిరంకుశపాలకుడు కావడానికి ఎన్నో కారణాలున్నాయి; ఎందరో ఎన్నివిధాలుగానో దోహదం చేశారు; రాత్రింబవళ్ళు కష్టనష్టాలకు గురియయ్యారు; అందులో పెద్దభాగం రామోజీరావుది. ఆయన పత్రిక ఈనాడుది. 1983 లో తెలుగుదేశం అధికారానికి రావడానికిగాని, 1984 సంక్షోభాన్ని నిగ్రహించుకొని రామారావు పునః పదవి నధిష్టించడానికిగాని 'ఈనాడు' లేకుంటే సాధ్యమయ్యేది కాదని చెప్పడం సత్యోక్తే అవుతుంది. అనాడు తెలుగుదేశము, దాని నాయకుడు రామారావు ప్రజలనెత్తిన కిరీటం పెడతారని పూనించి హాపి లిచ్చి ఓట్లు కొల్లగొట్టింది 'ఈనాడు', దానిద్వారా రామోజీరావు! వుతన్యాసాలు దంచింది, వార్తావాలు చేసింది రామారావుగారే అయినా, వాటిని నమ్మబలికింది, వ్యామోహితులను జేసింది "ఈనాడు" ఈరోజు ఆనాటి రామారావు మాటలు నీటిమూటలై వుండవచ్చు; కాని 'ఈనాడు' వ్రాతలు ఎట్లా చెరిగిపోతాయి? రామోజీరావు వ్యాసాలు, 9 తేది 'ఈనాడు' సంపాదకీయం ప్రజలపట్ల బాధ్యతను రామారావు మరచినా తాము మరువలేదని చాటుకోవడమే అవుతుంది.

'ఈనాడు' తెలుగుదేశం అధికార పత్రికగా, రామారావు పక్షపాతిగానే పేరుపొందింది. అయినా రామారావుకు ఆ పత్రిక చేస్తున్న ప్రచారం, ఇస్తున్న

—తరువాయి 8వ పేజీలో

# జమీన్‌రైతు

## మళ్లీ మోసాలు, వేషాలు

వేషాలు, మోసాలు ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుకు వెన్నతోపెట్టిన విద్యలు. ప్రజలను మభ్యపెట్టడం, మాయచేయడం ఆయనకు మంచినీళ్ళప్రాయం. ఓట్లకోసం ఏమైనాచేయడం, ఎంతటి పచ్చి అబద్ధాలనైనా వేదికలెక్కి చెప్పడం ఆయనతత్వం. తన స్వార్థం కోసం, తన పార్టీ లాభంకోసం ప్రభుత్వ ఖజానాను పణంగాపెట్టడానికి ఆయన వెనుకాడడని రాష్ట్ర ప్రజలందరికీ బాగా అర్థమైపోయింది.

ఈ ఐదేళ్ళలో రామారావు ఎన్నివేషాలు వేశాడు? ఎన్ని ఎత్తుగడలువన్నాడు? ఎన్ని అవతారాలెత్తాడు? పాతబస్తీలో కుచ్చుల టోపీ పెడితే, సాగర తీరంలో జాలరిటోపీ; తొలి ఎన్నికల్లో సబ్సిడీ బియ్యం, మలి ఎన్నికల్లో మధ్యాహ్నభోజనం; ఈ మధ్యలో చిరంజీవి సుఖీభవ నుంచి, క్షీరసాగర ప్రదానం, మాగాణి సమారాధనం వరకు లెక్కకు అందనన్ని పథకాలు. ఎన్నికలపబ్బం గడిచిన మరుక్షణంలోనే వాటన్నింటికి తిలోదకాలు. ఎంత ప్రచారార్భాటంతో కొత్తపథకాన్ని ప్రకటిస్తాడో, అంతే సందడిలేకుండా ,దాన్ని పాడుపెడ్తాడు. ఎంత ఘనంగా ఒక వాగ్దానంచేస్తాడో, అంతేసులభంగా దాన్ని మర్చిపోగలడు. ఎన్టీ ఆర్ రాజకీయాలలో ప్రవేశించినప్పటి నుండి నేటివరకు ఆయన చేసిన వాగ్దానాలు, రూపొందించిన పథకాలపై ఎవరైనా పరిశోధన చేయాలేగాని, ఒక పి హెచ్ డి కి సరిపడా సమాచారం దొరుకుతుంది.

ఎన్టీ రామారావు ఇప్పుడు మళ్ళీ ఈ మోసాలు, మాయ మాటలు, ప్రలోభాలు ప్రారంభించాడు. హైకోర్టు తీర్పువల్ల తన పరిపాలనపై, తనపై ఏర్పడిన మచ్చలు తొలగించుకోవడానికి; కల్మషం కడుక్కోవడానికి ఆయన ప్రభుత్వ ఖజానాను పణంగా పెట్టి, కొత్తకొత్త పథకాలు ప్రకటిస్తున్నాడు. ఈ వారంలోనే ఎన్ని వాగ్దానాలు?

ఏలూరులో ఎన్జీవో సభకువెళ్ళి వారు కోరినన్ని వరాలు ప్రసాదించాడు. సెక్రెటేరియట్ ఉద్యోగులను తన తమ్ముళ్ళు, చెల్లెళ్ళుగా సంబోధించి నోటికొచ్చిన వాగ్దానమల్లా చేశాడు. లారీ డ్రైవర్ల సభలో మాట్లాడుతూ వారికి ఇళ్ళు, అప్పులు, జీవితభీమా పథకాలు ప్రకటించాడు. తుఫాన్‌లో నష్టపోయినఇళ్ళకు ఇకనుంచి వెయ్యిరూపాయలిస్తానన్నాడు; రిక్షాకార్మికులందరికీ ఏడాదికొక జత వస్త్రాలు బహూకరిస్తానని మాటయిచ్చాడు; మోటారు కార్మికులకు ఉచిత వైద్యసహాయం, నిరుద్యోగ యువకులకు ఉచిత బస్సు ప్రయాణం, దరఖాస్తురుసుము రద్దు, ప్రభుత్వోద్యోగులకు పదివేల ఇళ్ళు, ఉద్యోగనాయకులకు బదిలీల రద్దు, వారిపై కేసుల రద్దు... ఇట్లా ఈ వారంలోనే ఆయన కొన్నివందల వాగ్దానాలు కురిపించాడు. అన్నింటినీ మించినది పెట్రోలుపై ఒక రూపాయి అమ్మకం పన్ను రద్దు.

ఆయన చేసిన వాగ్దానాలన్నీ సమాజంలో తనకు ప్రతికూలంగా మారుతున్న వర్గాలవారిని మంచిచేసుకోడానికి, వారిని ప్రలోభపెట్టడానికేననేది సుస్పష్టం. పోనీ, తన ఓట్లకోసమే అయినా కొందరికైనా మంచిజరుగుతుందా అనుకుంటే, ఈ పథకాలు ఆచరణలోకి వచ్చేనంతవరకు నమ్మకంలేదు. ఉద్యోగుల జీతాలకే డబ్బు చాలక దివాలాతీస్తున్న ప్రభుత్వం, ఇప్పుడు అమలులోవున్న సవాలక్ష పథకాలను పాడుబెట్టివున్న ప్రభుత్వం, కొత్తపథకాలను అమలుచేస్తుందని, చేయగలస్థితిలో వుందని ఎవరూ విశ్వసించలేకున్నారు.

ఆచరణసాధ్యంకాని వాగ్దానాలను క్రుమ్మరించి, ప్రజలకు అరచేతిలో స్వర్గంచూపి, తన మేలుకోసం ప్రభుత్వ ధనాన్ని మంచినీళ్ళలాగా ఖర్చుచేయడం ఘోరమైన నేరం. ముఖ్యమంత్రి ఈ రాష్ట్రాన్ని తన స్వంత జాగీరులాగా భావించి, ఇష్టారాజ్యం నడిపితే రాష్ట్రం అధోగతిపాలౌతుంది. వివేకవంతులైన ప్రజలు, ప్రతిపక్షాలు ఆయన దుర్మార్గపు కుతంత్రాలను ప్రతిఘటించడం అవసరం

# రాజీవ్‌పై రంకెలువేసినవాడు తనతప్పులుదాచుకోవడమేమిటి

బోఫోర్స్, ఫెయిర్‌ఫాక్స్ కుంభకోణాల మీద న్యాయవిచారణ జరిపించి, దోషులను కఠినంగా శిక్షించాలని, అందుకు అవసరమైతే తానే స్వీడన్ వెళతానని రంకెలువేసిన ముఖ్యమంత్రి రామారావు తనపైవచ్చిన ఆరోపణలకు సాక్ష్యాధారాలున్నట్లు హైకోర్టు తీర్పు యిచ్చినా దాన్ని నిర్లక్ష్యంచేసి, దాన్నికప్పిపుచ్చుకోవడానికి మహానాటకం లాంటి వేదిక ప్రారంభించడం ఆయన మహానటనకు నిదర్శనం

సారాబాట్లింగ్ కేసులో కోర్టుతీర్పుకు తలవొగ్గి రాజీనామాచేసిన కర్నాటక ముఖ్యమంత్రి రామకృష్ణహెగ్డేను చూచైనా రామారావుగారు నేర్చుకోలేకపోవడం శోచనీయం. ఆరుకోట్ల ఆంధ్రులు అడిగితే రాజీనామా చేస్తాననడమేమిటి? అంటే ఆరుకోట్లమంది అబిడ్స్‌లో ముఖ్యమంత్రి ఇంటిముందుచేరి కోరాలి కాబోలు. ఈ టొంకతిరుగుడు జవాబులు మాని ముఖ్యమంత్రిత్వానికి రాజీనామా చేయడం గౌరవప్రదం.

నెల్లూరు -కె. ఎస్. వరదరాజన్

### ఆలయాల దుస్థితి

కావలి డివిజన్ జలదంకి, రుద్రకోట, జక్కవల్లి గూడూరు, చిన్న అన్నలూరు, బోగోలులోని ఆలయాల పరిస్థితి చాలా అధ్వాన్నంగా వుంది. దేవుళ్ళకు దీపారాధన, నైవేద్యాలుకూడా కరువైనాయి. అర్చకులకు చిల్లిగవ్వ ఇవ్వడంలేదు. ఆలయాలు శిథిలావస్థకు చేరుకున్నాయి; వర్షం వస్తే ఒకటే కురుపు; తలుపులు, ధ్వజస్తంభాలు పడిపోయేటట్లున్నాయి కావలి అర్చక కాంగ్రెస్ కోశాధికారి బి. వేణుగోపాలాచారితో కలిసి నేను ఆలయాలన్నీ చూచాను. కొన్ని చోట్ల విగ్రహాలు, పూజావస్తువులు జాగ్రత్త చేయలేక అర్చకులు తంటాలు పడుతున్నారు. ఆలయ అధికారులు గారు విధి నిర్వహణలో అజాగ్రత్తగా వుంటున్నారు. ఈ విషయంపై విచారణ జరిపి ఆలయ సంపదను సంరక్షించాలి.

-ఎం. చంద్రశేఖరదీక్షితులు
అధ్యక్షుడు
కావలి డివిజన్ అర్చక కాంగ్రెస్

### రాజకీయాల హోరులో సమస్యలకు బండిసున్న

రాష్ట్రంలో కావాలనిసృష్టిస్తున్న రాజకీయ ఆందోళనలు, నాటకాలు, బూటకాలు, ప్రకటనలు, వాగ్వివాదాల హోరులో ప్రజా సంక్షేమాన్ని, ప్రజా సమస్యలకు బండిసున్నా చుట్టేస్తున్నారు. కరెంటు కోత గురించి, రాబోయే వేసవిలో ఎదుర్కోవలసివున్న నీటికొరత గురించి, పెరిగిపోయిన నిత్యావసరవస్తువుల ధరల గురించి, జీతాలులేక అల్లాడిపోయే సిబ్బంది గురించి పట్టించుకునే నాథుడే లేడు ఈ విధమైన పరిపాలన క్షమార్హంకాదు.

కావలి -కె. రమాకాంత్

### తపాలా నిర్వాకం మరికొన్ని విశేషాలు

పోయినవారం మీ పత్రికలో పోస్టల్ శాఖను గురించి అనేక వివరాలిచ్చి వాస్తవాలను ప్రజల ముందుంచారు ఒక తపాలా ఉద్యోగిగా నేను మరికొన్ని విషయాలు తెలుపుతున్నాను. పోస్టల్ శాఖకు ఆర్ ఎం ఎస్.. గుండెకాయ వంటిది ఒకప్పుడిది క్రమంగా మాసిపోయింది. ఇటీవల రైళ్ళలో సార్టింగ్ పద్ధతి ఎత్తేయడం, ఆఫీసుల్లో సిబ్బందిని తగ్గించడం, వున్న సిబ్బందికి పనిభారం పెరగడం, ప్రభుత్వం పొదుపు పేరుతో ఓవర్‌టైమ్ అలవెన్సులను తగ్గించడంతో ఆర్. ఎం. ఎస్ పరిస్థితి మారిపోయింది. ఎటువంటి పరిస్థితిలోనూ ఉద్యోగులకు సెలవివ్వవద్దని పైనుండి ఆర్డరట

నెల్లూరు -ఒక ఆర్.ఎం.ఎస్. ఉద్యోగి

★

### 1938 లో ఈవారం పత్రిక లేదు

14-1-1938 తేది వెలువడవలసిన సంచిక ఏందువల్లనో నిల్చిపోయింది. అందువల్ల '50 ఏళ్ళక్రితం ఈవారం' శీర్షిక నిలిపివేస్తున్నాము.

# విశ్వనాథ్ ఆత్మవిశ్వాసానికి సాహసం తోడుకావాలి!

మనం గర్వించదగ్గ దర్శకుల్లో కె. విశ్వనాథ్ ముఖ్యులు. బాగా చదువు కున్నవారు. సాంకేతిక నిపుణుడుగా ఎంతోకాలం అనుభవం గడించినవారు. మామూలుగా ఎక్కువ చిత్రాలను డైరెక్టు చేసి పుష్కలంగా డబ్బు వెనకేసుకోవాలనే తపనమాత్రం లేనివారు. బాగా తక్కువ చిత్రాలను అంగీకరించి, నాణ్యత గల చిత్రాలనే ఉబలాటం కలవారు. మిక్కిలి మన ఆచార వ్యవహారాలను, సంప్రదాయాలను, సంస్కృతిని సినిమా ల్లో ప్రస్ఫుటింపజేయాలనే మహదా శయం గల వ్యక్తి. అందుకే "శంకరా భరణం" లాంటి ఉత్కృష్టమైన చిత్రాలు ఆయనకు ప్రఖ్యాతి తెచ్చాయి.

కాని, ఆయన తదుపరి చిత్రాలలో

### కళాతపస్వి కాస్త మారాలి!

కూడా "శంకరాభరణం" పోకడలే కని పిస్తున్నాయని చాలామంది అభిప్రాయం. ఆయన కథలుకూడా దాదాపు ఒకేమూసలో తయారైనట్టున్నాయని అనుకుంటు న్నారు. మన శాస్త్రీయ సంగీత నృత్యాల ఔన్నత్యాన్ని చాటడమే ఆయన ప్రతి చిత్రంలోనూ కనిపిస్తోంది. అది అతి అవడంతో కొంతవరకే వెగటుకల్గడం సహజమే.

విశ్వనాథ్ చిత్రాలు వెరైటీగా వుండా లని చాలామంది కోరుకుంటున్నారు. ఏ తరహా చిత్రాన్నయినా సెల్యులాయిడ్ మీద మలచడంలో ఆయన సిద్ధహస్తుడు గనుక ఆయన గిరుకున్న పరిధిని దాటి వచ్చి, అత్యాధునిక సాంఘిక సమస్య లను చర్చించే "శుభలేఖ" లాంటి చిత్రా

—కొరవ 9వ పేజీలో

# ఔట్‌డోరు షూటింగుకు అరవ సోదరులు ఐదువేలు గుంజారు

స్టూడియో అద్దె, సెట్స్ నిర్మాణ వ్యయం వగైరాలు పెరగడంతో నిర్మా తలు బయట ఔట్‌డోర్‌లలో షూటింగ్‌లు జరపడం సర్వసాధారణమై పోయింది. పైగా, ఔట్‌డోర్‌లో అయితే ప్రకృతి దృశ్యాలను ఎంతో మనోహరంగా చిత్రీక రించవచ్చుకూడా. ఇటీవల ఒక తెలుగు చిత్రానికి మద్రాసుకు ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉన్న తతవ అనే గ్రామంలో షూటింగ్ ఏర్పాటు చేసుకున్నారు ఆ ఊరి గుడిబయట. పాతకాలంవర్ద కోనేరు పక్కన డాన్స్‌లు చిత్రీకరించారు. ఆ ఊరి పెద్దమనుషులు కొందరు షూటింగ్ చూడ్డానికి వచ్చినట్టు వచ్చి,

### అదీ ఖరీదే!

దర్శకుని, నిర్మాతను కలిశారు. చిత్రం పేరు ఏమిటని అడిగి మెల్లగా వివరాలు తెలుసుకున్నారు. ఇవే సన్నివేశాలను సెట్స్ నిర్మించి తీస్తే ఎంత ఖర్చవు తు.దనికూడా అడిగారు. నిర్మాత వివ రించారు. "ఐతే, మేం ఈ ఊరి పంచా యితీసభ్యులం. మాఊళ్లో షూటింగుచేసి నందుకు ఐదువేలు చెల్లించాలి," అన్నారు. యూనిట్‌లోని వాళ్ళంతా ఖంగుతిని, "ఇదేం న్యాయం? ఇలా మేమిదివరకెన్నడూ చెల్లించలేదు," అన్నారు. "మా ఊరి గుడిని ఇటీవలే మేం కొన్ని వేలు ఖర్చుపెట్టి బాగు చేయించాం. పాతకాల ఇటీవలే నిర్మించ

—కొరవ 9వ పేజీలో

# పర్సంటేజి పద్ధతే న్యాయం!

స్లాబ్ సిస్టమ్ వల్ల తారలు, సాంకేతిక నిపుణుల రేట్లుపెంచేశారు. చిత్రనిర్మాణ వ్యయం విపరీతంగా పెరిగిపోయింది. ఈ విధానంవల్ల కొన్ని థియేటర్లు మూత పడ్డాయికూడా. కనుక స్లాబ్ సిస్టమ్‌ను తీసివేస్తే మంచిది అని- ఇదివరకు గోల పెట్టిన నిర్మాతల్లో కొందరు ఇటీవల ముఖ్యమంత్రిని కలుసుకొని స్లాబ్‌సిస్టంను పుండాలని విజ్ఞప్తి చేయడం మిగతావారికి విభ్రాంతి కల్గించింది.

విజ్ఞప్తి చేసిన వారిలో ఎక్కువమంది

### ఇందులోనూ ఆశ్రిత జన పక్షపాతమే!

బాలకృష్ణతో, చిరంజీవితో చిత్రాలు నిర్మి స్తున్న వారే. ఆ హీరోలతో భారీచిత్రాలే తయారవుతాయి. వీళ్ళకు మాత్రమే స్లాబ్ సిస్టం వుపకరిస్తుంది. మరి కొత్త తారా గణంతో తక్కువ బడ్జెట్‌లో చిత్రాలు నిర్మించేవారి సంగతేమిటి? అదెవరూ పట్టించుకోరేం! చిత్రపరిశ్రమమీద ఎం దరో ఆధారపడి బ్రతుకుతున్నారు. ఏ అల్పసంఖ్యాక వర్గానికో మాత్రమే తోడ్పడే ఈ విధానాన్ని ఇంకా కొనసా గించాలని కోరడం సబబుకాదు.

అసలిదివరకు పర్సంటేజ్ పద్ధతి వున్నప్పుడే తెలుగు సినిమారంగం ఎంతో చక్కగావుండేది. నిర్మాత, పంపిణీ దారు, ఎగ్జిబిటరూ ముగ్గురూ సమానంగా చిత్రంమీద లాభనష్టాలను పంచుకునే వారు. థియేటర్లలో 'మాల్ ప్రాక్టీస్' లేకుండా, అధికారుల జులుంను అరికట్ట గల్గితే, పర్సంటేజ్ విధానమే ఎల్లవేళలా మంచిది. చక్కని కథలతో కొత్త తారా గణంతో చిత్రాలుతీసేవారికి ఎంతో మేలు జరుగుతుంది. ఈ విషయం సినిమా రంగంలో ఎంతోకాలం అనుభవమున్న ముఖ్యమంత్రికి తెలియనిదికాదు. కాని ఈ స్లాబ్ పద్ధతిని పెట్టడంలో కూడా ఆయన ఆశ్రితజన పక్షపాతం ప్రస్ఫుట మవుతోంది. భారీయెత్తున ముఖ్యంగా బాలకృష్ణతో చిత్రాలుతీసే నిర్మాతలం దరూ ఆయన సన్నిహితులే! వీరిలో ఎక్కువమంది ఆయన బంధువులుకూడా. వీరికి మాత్రం వుపయోగించే స్లాబ్ విధా నాన్ని కొనసాగిస్తూ, మిగతావారి కష్ట నష్టాలను పట్టించుకోకపోవడం అన్యా యమే మరి. చాలా చక్కని చిత్రాలు విడు దల చేసే సాధుడు దొరక్క బాక్సులో

—కొరవ 9వ పేజీలో





"స్వర్ణకమలం"లో భానుప్రియ

# శుభోదయ "దొంగగారికి" స్వాగతం చెప్పలేరు!

కృష్ణ సమర్పణలో శుభోదయా ఆర్ట్ ప్రొడక్షన్సువారు విడుదల చేసిన "దొంగ గారూ స్వాగతం"లోని దొంగ మామూలు దొంగకాదు; అతని తరహానే వేరు. ఇతను చేసే దొంగతనాలు తనకోసం చేయడు; న్యాయంకోసం చేస్తాడు, దుర్మార్గులు, మోసగాళ్ళ మూలంగా అన్యాయానికి గురైనవారికి, అసలింగా దేనినైనా సంగ్ర హించి తెచ్చి యిచ్చి ఆదుకునే స్వార్థ రహితుడైన దొంగ ఇతను. అందుకే ఈ దొంగకు గౌరవం దక్కింది.

ఈ చిత్రానికి కథకుడు సాయినాథ్, దర్శకుడు జి. రామమోహనరావు, నిర్మాత వై. సత్యనారాయణ. ఈ దొంగను "గారూ" అని సంబోధించి "స్వాగతం"-పలికారు. కాని ప్రేక్షకులు అంతగా ఈ చిత్రానికి స్వాగతం చెప్ప లేకున్నారు. దీనికి కారణం పేరున్న పెద్ద తారాగణంతో తయారైన ఈ చిత్రం పేలవంగా వుండటమే! సాయి నాథ్ కథలోగాని; సంభాషణల్లోగాని బిగువు లేకపోవడం; దర్శకత్వంలో పట్టు కనిపించక పోవడం; సన్నివేశాలు నీర సంగా వుండటం; పాత్రలన్నీ మామూలు తరహాలో వుండటం; ఈ మూసపాత్రల్లో నటీనటులు గానుగెద్దుల్లా తమ మామూలు

### చిత్రసమీక్ష ★ గ్రిద్దలూరు గోపాలరావు

ధోరణిలో నటించడం; చక్రవర్తి సంగీతం చప్పగా వుండటం, చిత్రం చప్పగా తయారుకావడానికి దోహదమిచ్చాయి.

రాంబాబు (కృష్ణ) టాక్సీ డ్రైవరు, న్యాయంకోసం దొంగగా నటించే దొంగ. జగదీష్‌ప్రసాద్ (జగ్గయ్య) ఒక కోటీశ్వ రుడు రాంబాబు తండ్రి కుట్రవల్ల నింద గర్భవతియైన భార్యను వదిలేసి జగదీష్

—కొరవ 9వ పేజీలో

# వేరుశనగ

(4 వ పేజి తరువాయి)

వరకు ఎకరాకు 10 కిలోల ఫోరేట్ గుళికలను మొదటి పూతదశలో వేయడం మంచిది. వేరుశనగ పంటలో తెగుళ్ళ నివారణ, కలుపు నివారణ అవసరంగా చేసి ఈ 10 కిలోల గుళికలను యూరియా 2 శాతంగా పిచికారీ చేయడంవల్ల అదే నత్రజని భూమిలో వేయడంకంటే అధికదిగుబడి పొందవచ్చును. ఈ యూరియాలో తెగుళ్ళ రోగాలను నివారించు మందు గ్రా. డైథెన్.ఎం. 45 అనేమందులను అవసరాన్నిబట్టి కలిపి చల్లినపుడు ఎక్కువ దిగుబడి సంపాదించవచ్చును. వేరుశనగ విత్తనపుడు ఎరువులను భూమి పై చల్లడం కంటే గింజలువేసిన సాళ్ళకు 5 సెం. మీ. దూరంగా 10 సెం. మీ లోతులో వేయడంవల్ల దిగుబడి ఎక్కువగా వస్తుంది. గింజలను 5 సెం. మీ. లోతు కన్నా మించి వేయరాదు. దిగుబడి అధికమగుటకు ఇది చాలా ముఖ్యమైన వద్ధతి. హెక్టారుకు 500 కిలోల జిప్సం 5 సెం. మీ. లోతులో మొదటిపూత దశలో వేయాలి. జింకు మరియు ఇనుము ధాతువుల మొక్కకు లభించకపోవడం వల్ల చెట్లు బాగా పెరగవు. ఆకులంతా తెల్లబారుతాయి. అందువల్ల భూమిలో హెక్టారుకు 50 కిలోల జింకు సల్ఫేటువేసి కలిపి దున్నవలెను. ధాతువుల లోపం మొక్కలపై కనబడిన వెంటనే 0.2 శాతం జింకుసల్ఫేటు మరియు ఫెర్రస్ సల్ఫేటు 0.5 శాతం [అన్నభేది] + సిట్రిక్ ఆసిడ్ 0.1 శాతం కలిపి వెంటనే పిచికారీ చేస్తే ఎంతోమేలు జరుగుతుంది.

వేరుశనగ పంటను విత్తినప్పటినుండి 45 రోజుల వరకు కలుపుమొక్కల బారినుండి రక్షించాలి. కలుపు మొక్కలను తీసివేయడం శ్రమ, ఖర్చు అనుకుంటే 2 లీటర్ల బేసలిన్ కలుపుమందును 1000 లీటర్ల నీటిలో కలిపి గింజలు విత్తుటకుముందు ఒక హెక్టారు నేలపై బాగా తడిసేటట్లు పిచికారిచేసి, వెంటనే కలియదున్నాలి. లేకుంటే నీరు పెట్టి ఆరునట్లు చేయాలి. ఈ కలుపుమందు వాడుటకు ఎకరానికి 100 రూపాయలు ఖర్చు అవుతుంది. వేరుశనగ పంటను విత్తిన 45-50 రోజుల తర్వాత కలుపు తీయుట లేక దాళ్ళమధ్య దున్నుట చేసి మొక్కలను కదిలించుటవల్ల ఊడలు సరిగాదిగవు. పైగా వాటికి దెబ్బతగిలి దిగుబడి తగ్గుతుంది.

పురుగులు ఆశించిన పంటపై మోనోక్రోటోఫాస్/టోఫాగ/క్వినాల్ఫాస్/క్లోరోపైరిఫాస్ మందులను 0.05 శాతం పిచికారీ చేసి పురుగుల బారినుండి పంటను కాపాడుకోవాలి.

ఆకుమచ్చ తెగులు, తుప్పురోగం తగిలిన పంటకు డావిస్టిన్ మందు 0.1 శాతం అనగా హెక్టారుకు 750 గ్రా. మందు 750 లీటర్ల నీటిలో కలిపి పిచికారి చేస్తే రోగాలు తగ్గుతాయి.

వేరుశనగ పంట బాగా మొలచిన తరువాత మొదట 20-25 రోజులు నీరు పెట్టకుండా తర్వాత నీటిని 5 నుండి 10 రోజుల వ్యవధిలో ఇవ్వవలెను. నీటిపారుదల సౌకర్యం బాగా వున్నప్పుడు పంట 30 నుండి 60 రోజుల మధ్య నీటితడి తక్కువ వ్యవధిలో 5 రోజులకొక్కసారి ఎక్కువ సార్లు తేలికగా ఇచ్చినచో మంచిది. తరువాత కాయలు తయారగునపుడు 7-10 రోజులకొక్కసారి ఇవ్వవలెను; నీటియెద్దడి ఎక్కువగా వున్నప్పుడు 1 లేక 2 సార్లు పంటకాలములో 30 నుండి 75 రోజుల వ్యవధిలో

నున్నపుడు తడిని తగ్గించవచ్చు. కాని నీటితడిని తగ్గించినపుడు 2 శాతం యూరియా పిచికారిచేసిన నష్టం తగ్గవచ్చు. ఇంకా ఏమైనా సందేహాలుంటే రైతులు మాకు వ్రాస్తే వాటి సమన్వయం వరిష్కారానికి ప్రయత్నిస్తాము. ★

## చిత్రసమీక్ష

(7 వ పేజి తరువాయి)

అమెరికా వెళ్ళిపోతాడు. జగదీష్ తమ్ముడు ప్రసాద్ (చేబ) అనసూర్యడు, ఎస్టేటు మేనేజరు సుబ్రహ్మణ్యం (సత్యనారాయణ) జగదీష్ మరదల్ని (వై విజయ) ఇంట్లోచేసుకొని ఆస్తి కాజేయడానికి పథకంవేస్తారు. ఆ కుట్రను భగ్నంచేయడానికి రాంబాబు జగదీష్ ఇంట్లో చేరుతాడు; అతని అభిమానం సంపాదిస్తాడు. ఇంట్లోని దొంగల్ని పట్టుకోడానికి తాను ఒక దొంగగా నటిస్తాడు. జగదీష్ కూతురు లలిత (విజయశాంతి) అతని వద్దనే వుద్యోగానికి చేరుతుంది; అతను తన తండ్రి అని ఈమెకు తెలియదు, ఈమె తన కూతురని ఆయనకు తెలియదు, రాంబాబు ఆమెను ప్రేమిస్తాడు. జగదీష్- లలిత అనుబంధాలు, రాంబాబు నిజరూపం వెల్లడవుతాయి. ఇంటి దొంగలు పట్టుబడుతారు. పై టింగులు షరా మామూలే. రాంబాబు-లలితల పెళ్ళితో కథ కంచికి పోతుంది!

తండ్రి కూతుళ్ళ సంబంధం వారిద్దరికేగాక, ప్రేక్షకులకుకూడా తెలియక పోవడంవల్ల సస్పెన్సు ఎక్కువవుతుందనుకున్నారుగాని వాస్తవంగా నీరుగారిపోయింది. ఈ సంబంధాలు ఏ ఒక్కరికి తెలిసి కథ నడచివున్నా ఎంతో రక్తికట్టి వుండేది; నటీనటులు ఇంకా గొప్పగా నటించడానికి ఆస్కారం వుండేది. ఈ విధంగా అనేక సన్నివేశాలు సంఘటనలు పేలవంగా తయారయ్యాయి.

దృశ్యాల సంగతి ఇలా తగలబడ్డా పేరుగల నటీనటులను ఉపయోగ పెట్టుకోవటంలో దర్శకుడు వెలగబెట్టింది ఏమీలేదు కృష్ణమే కథకు అలంకారంగావుంది. అతని నటనలో కొంతైనా కొత్తదనం కనిపించలేదు, విజయశాంతిని దాన్సులకు డ్యూయట్లకే పరిమితం చేశాడు దర్శకుడు. హాస్య నటుడైన వేలు, శుభలేఖ సుధాకర్ లను హాస్యానికి కొంత వరకైనా వాడుకోలేక పోయాడు. జగ్గయ్య, సత్యనారాయణ, గొల్లపూడి గిరిబాబు, పాత్రలు కూడా అలాగే తెందుకాక పోయాయి.

పుష్పాల గోపీ కృష్ణ ఫోటోగ్రఫీ మాత్రంబాగుంది. ★

## తమిళ సోదరులు

(7 వ పేజి తరువాయి)

ఇడింది. మా ఊళ్ళోని ప్రకృతిసంపద అంతామాదే. ఈ సంపదను మీరు చిత్రీకరించి డబ్బు చేసుకోవడం న్యాయమా? ఈ పెద్ద మీ స్టూడియో కోవేస్తే కదివేలకు పైగా అవుతుందన్నారు. మేం అందులో సగమే అడిగాం. మీకిచ్చిన డబ్బును మా ఊళ్ళో గ్రంథాలయం, సత్రం బాగు చేయించుకోడానికి వినియోగిస్తాం. అంతేక, మీరు ఐదువేలు చెల్లించనిదే ఇక్కడు_ంచి కదలనీకి వీల్లేదు. "...ని కచ్చితంగా చెప్పేశారు. పాపం, నిర్మాత నిరమాడలేయారు. ఆ పక్షులం ఒడక వచ్చారు పెద్దమనుషులు. "మా ఆంధ్ర రాష్ట్రంలో ఇలా ఏ పల్లెలోనూ డబ్బులు అడగరు," అంటే, ఆ పెద్దమనుషులు

అన్నారటకదా "అందుకే మీ రాష్ట్రంలో గ్రామాలు ఎంతో వెనుకబడి ఉన్నాయి. ఒక్కడి అమాయక ప్రజలను మోసపుచ్చి మీరు లక్షలకు లక్షలు షూటింగులు చేసుకుంటూ ఉంటారు." అని "మీ ఊరు పేరు టైటిల్సులో వేస్తాం." అని దర్శకుడంటే, "అందువల్ల మాకు ఒరిగేదేమిటి? మా ఊరు మీ బాబుగారి సొత్తు అనుకున్నారా ఇష్టం వచ్చినట్లు షూటింగులు జరుపుకోడానికి? మర్యాదగా ఐదువేలు ఇక్కడ పడేసి కదలండి లేకపోతే మిమ్మల్నెవర్నీ ఇక్కడ్నుంచి కదలనివ్వం." అన్నారు. చివరికి ఆ ఐదువేలూ చెల్లించక తప్పింది కాదు ఆ యూనిట్ కు.

గ్రామ ప్రజలకు సైతం సినిమాల వారంటే తమిళనాడులో విమాత్రం మోజు లేదనడానికి ఇదొక నిదర్శనం. ఇదే మన రాష్ట్రంలో అయితే, ప్రజలందరూ అన్ని పనులూ మానుకొని షూటింగులు చూడడమేకాక ఆ సినిమాల వారికి భోజన వసతులన్నీ తామే స్వయంగా ఏర్పాటుచేస్తారు.

తమిళనాడులోని గ్రామీణులు మన కన్నా ముందంజ వేస్తున్నారన్నమాట! ★

## విశ్వనాథ్

(7 వ పేజి తరువాయి)

లను రూపొందించవచ్చుకదా?

పది వెర్తెచిత్రాలమధ్య ఒక చక్కని విశ్వనాథ్ చిత్రం విడుదలైతే, ప్రేక్షకుల ఆదరాభిమానాలను విశేషంగా పొందడం మనం గమనిస్తూనే వున్నాం. కాని, తనునుంచి "శంకరాభరణం" రీతిలోని చిత్రాలనే ప్రేక్షకులు ఆశిస్తున్నట్లు విశ్వనాథ్ అభిప్రాయంగా తోస్తోంది. అందుకే ఆయన శాస్త్రీయ కళల గురించి తప్ప మరోవిషయం గురించి ఆలోచిస్తున్నట్లు లేదు. ఆయన చిత్రాలన్నీ ఇటుపైన కూడా ఒకే టైప్ లో వుంటే, ఇక ఆయనమీద ప్రేక్షకులు పెట్టుకున్న ఆశలు వమ్ములవుతాయి. ఆయనకిష్ఫుడు వంశీ విభిన్నమైన ఇతివృత్తాలను తెరకెక్కిస్తూ విజయపరంపరలను చవిచూస్తున్నప్పుడు విశ్వనాథ్ మాత్రం తటపటాయించడం దేనికి?

కనుక, విశ్వనాథ్ ఇకనైనా తనధోరణిని మార్చవలసిన అవసరం ఎంతైనా వుంది. అప్పుడే ప్రేక్షకుల హృదయాలలో ఆయనకున్న స్థానం మరింత సుస్థిరమవగలదు.

విశ్వనాథ్ కు ఎంతో ఆత్మవిశ్వాసమున్నా ఆయన సాహసి మాత్రం కాదు; కాని, ఇటుపైన ఆయన సాహసించి, మరింత విజృంభించవలసిన అవసరం ఎంతైనావుంది. ఇది ఆయన అభిమానులందరి ఆకాంక్షకూడా.

## ఫ్లాప్ సిస్టం

(7 వ పేజి తరువాయి)

మూల్గుతున్నాయి. అలా మూల్గుతున్న చిత్రాలలో ఒకదానిని సురేష్ ప్రొడక్షన్స్ డి. రామానాయుడు పంపిణీ బాధ్యతలు స్వీకరించి, విడుదల చేశాడు. ఆ చిన్న బడ్జెట్ చిత్రం బ్రహ్మాండంగా ఆడుతోంది. చిరంజీవి, బాలకృష్ణ చిత్రాలకన్నా మిన్నగా ప్రదర్శింపబడే అలాంటి చిత్రాలెన్నో మగ్గుతున్నవి వున్నాయి. పర్సంటేజ్ విధానం మళ్ళీ వస్తేగాని ఈ చిత్రాలకు మోక్షంరాదు.

అందుక, ఏ కొద్దిమందిపో దృష్టిలో వుంచుకోకుండా అధిక సంఖ్యాకులకు వుపకరించే పర్సంటేజ్ విధానాన్ని అమలు చేయవలసిన అవసరం ఎంతైనా వుంది. ★



In the Court of the Subordinate Judge Addanki

E. P. No. 2/86 in

O. S. 319/80

Sub Court Ongole

Between

Union Bank of India, Pasumarru, represented by its Branch Manager

-Decree-holder

and

1. Bandarupalli Lakshmi-Prasad and others

-Judgement-debtors

Property of first Judgement Debtor to be sold in public auction.

Prakasam District Registration. Martur sub Registration. Ananthavaram Village.

1) S. No. 398 an extent of Ac. 4-80 cents out of Ac. 13-90 cents

Bounded by :

East : Mandalapu Rathaiah

South : Polimera

West : Bandarupalli Bhaskararao

North : Vagu poramboke

DHr's Value Rs. 8000/-

Amin's Value Rs. 60,000/-

2) S. No. 410/B Ac. 2-74

S. No. 410/C Ac. 0-96

S. No. 409 Ac. 10-87

S. No. 411/1 Ac. 11-35

Total Ac. 26-02 cents

Out of the above, an extent of Ac. 14-04 cents bounbed by :

East : Bollapalli Pothuraju and others

South : Bollapalli Robar and others

West : Donka

North : Bandarupalli Venkateswarlu

D.H.R's Value Rs. 10000/-

Amin's Value Rs. 21,600/-

Sale is posted to 25-1-88

Further hearing 1-2-88

-N. Dasaradharamaiah

Advocate for D.Hr.



నెల్లూరు అ. డి. జడ్జి కోర్టులో

E. P. 75/86

O. S. 81/78

A. P. వక్ఫ్ బోర్డువారు రెప్రజెంటెడ్ సెక్రెటరి -వాది

లింగారెడ్డి అమ్మణ్ణి వురఫ్ అమ్మణమ్మ వగైరాలు -ప్రతివాదులు

నోటీసు

(1) ఎల్. అమ్మణ్ణి వురఫ్ అమ్మణమ్మ భర్త లింగారెడ్డి సాకిన:- సంతపేట నెల్లూరు

8) షేక్ అబ్దుల్ రవూఫ్ తండ్రి కాశీపా సాకిన సంతపేట-నెల్లూరు

10) ఆర్. మునుస్వామి తండ్రిపేరు రంగయ్య సాకిన సంతపేట-నెల్లూరు

14) పి. రమణారెడ్డి తండ్రి శేషారెడ్డి సాకిన సంతపేట-నెల్లూరు

15) పి. కోదండరామిరెడ్డి తండ్రి శేషారెడ్డి సాకిన సంతపేట-నెల్లూరు

16) పి. చంద్రశేఖరరెడ్డి తండ్రి శేషారెడ్డి సాకిన్ సంతపేట-నెల్లూరు

18) పి. జనార్దనరెడ్డి తండ్రి శేషారెడ్డి సాకిన సంతపేట-నెల్లూరు

19) పి. పిచ్చిరెడ్డి తండ్రి శేషారెడ్డి సాకిన సంతపేట-నెల్లూరు

20) పి. బుజ్జమ్మ తండ్రి శేషారెడ్డి సంతపేట-నెల్లూరు

ఈ నెంబరు 1, 8, 10, 14 to 16, 18, 19 మరియు 20 ప్రతివాదులకు హేతువు నోటీసు జారీ నిమిత్తం 4-2-88 తేదీకి వాయిదా వేసియున్నారు సదరు వాయిదారోజునపగలు 10 గంటలకు ఈ కోర్టువారి ఎదుట హాజరయి మీకుగల ఆక్షేపణలు తెలుపుకోవలసినది లేని యెడల మీ పరోక్షమున తీర్మానించబడును.

-షేక్ యూసఫ్

వాది అడ్వొకేటు

## నెల్లూరు గుసగుసలు
### విహార్యకుడు

#### పేజీల సవరణ

సంక్రాంతి సెలవుల కారణంగా ఈ వారం పత్రిక 8 పేజీలతోనే వెలువడుతోంది. పాఠకులు గమనించ ప్రార్థన. పేజీ సంఖ్యలో తేడాలు సవరించుకోమని మనవి.

### చక్కెరలేని సంక్రాంతి!

పౌరసరఫరాల శాఖ బుధవారం వరకు బియ్యంకూడా సరఫరా కాలేదు; నెల్లూరు టవున్ డిపోలకో మాత్రం మంగళవారం నుంచి బియ్యం, అయితే కార్డుకు కంపెనీ అస్తున్నట్టుంది. చక్కెర ఇవ్వలేదు. కార్డుకు బియ్యంకూడా లేదు. నెల్లూరునుండి గ్రామాలలోని డిపోలకు సరుకులు చేరేసరికే సంక్రాంతి దాటిపోయినా ఆశ్చర్యం లేదు.

సంక్రాంతికి పెంచిన కందిగ తెలుగువారికిలేదు; అటువంటిసంక్రాంతికి పత్ర్యపాయసం, అరిసెలన్నా వండటి దేమి తెలుగు; కాలేకడుపుకు కొంచెం మంచే గంజి పోయడానికైనా బుధవారం వరకు బియ్యం పైతం సరఫరా చేయలేకపోయింది, ఈతెలుగు మహానాయకుని ప్రభుత్వం! కందిపప్పుకూడా పేదవారిని ఎంత గట్టి ఈసఫంత భూసీ!

### బ్యాంకును బురిడీకొట్టాడు ఒక 'గంగాధర్'!

ఇండియన్‌బ్యాంకి తిరుమంగళం బ్రాంచి (మద్రాసు)నుండిది గంగాధరం అనేవ్యక్తి 5 వ తేది రూ 85 000 లకు ఒకడ్రాఫ్టు తెచ్చి ఇండియన్‌బ్యాంకి నెల్లూరు బ్రాంచిని బురిడీకొట్టి పైకం తీసిలో వేసుకొని కం డెలుసుకుపేరోవల కాలికి బుద్ధిచెప్పారు. ఆ గంగాధర్ అనే ఒక తమిళుడు!

డ్రాఫ్ట్ పోర్జరీ సంబంధ్ ఇ తెర్పు; ఆ బ్రాంచి మేనేజర్ సంతకం ఫోర్జరీ; తతి తయిపు ఖాలు నమ్మదగేవుంది. పెద్ద మొత్తం కాబట్టి, ధృవీకరించుకోవడానికి ఆ బ్రాంచి టెలిఫోన్ కోసం బాగలేదంటు వల్ల ప్రాంతీయ కార్యాలయానికి మెసేజ్ ఇచ్చి, అన్ని సరిగా వున్నట్లు నమ్మకం కుదిరింది కాబట్టి డబ్బుమొత్తం ముస్కోకొట్టిన గంగాధర్ చెల్లించిందారు నెల్లూరు బ్రాంచివారు. అతను సింహపురి హోటల్‌లోని ఒకరూమును తీరా అలో ఖాలిచేసి, డబ్బుపాటులో నెల్లూరు నుండి అదృశ్యమై పోయాడట! మరో పేరుతో అంతమొత్తానికి ఒంగోలు బ్రాంచిని కూడా మోసగించడానికి చూడాడటగాని; వారు ధృవీకరణకోసం సిరిత్తి తతంతో అయ్యగారు దక్కా జాకునున్నారట.

నెల్లూరు బ్రాంచివారు పోలీసుకురిపోర్టు చేశా; డి. ఎస్. పి శ్రీ నరసింగరావు వెంటనే ఆ మోసగాని కోసం గాలింపు ప్రారంభించినట్టుంది మద్రాసులో ఇటువంటి గ్యాంగు ఒకటుందని, మనుషుల పోలిక తెలిసిందిగాని, వాళ్ళంతా పరారీలో వున్నారని అంటున్నారు.

తిరుమంగళం శాఖలోని డ్రాఫ్టుల పుస్తకంలో మూడు డ్రాఫ్టుల చోరగ్రస్తమైవుండినాయని, నెల్లూరు ఒంగోలు బ్రాంచిల్లో నమర్పించబడినవి వాటిలోనివేనని తెలుస్తున్నది - ఆ బ్రాంచి మేనేజర్ సంతకంమాత్రం ఫోర్జరీ అట. అది బ్రహ్మదేవుడుకూడా కనుక్కోలేనంత అచ్చం ఆమేనేజర్ సంతకంపలెనే వుందట!

డ్రాఫ్టు ఎవరైనది, మొత్తం చిన్నది అయితే గట్టిగా పట్టిచూస్తాయి బ్యాంకులు; ఫోర్జరీ డ్రాఫ్టు పెద్ద మొత్తం, ఘరానా మనుషులైతే ...ట్లా తేలి పోతుంటాం! నమ్మి దారపాటు ఐడితేనేగదా నెత్తి [illegible]!

### పెట్రోలు రూ 1-56 లు పెరిగింది!

పెట్రోలు రేటును లీటరుకు ఒక రూపాయి పెంచింది కేంద్ర ప్రభుత్వం. స్థానిక పన్నులతో కలసి ఆ పెరుగుదల నెల్లూరులో రూ 1-56 లు అయింది!

నెల్లూరులో పెంపకానికి ముందు లీటరు ధర రూ 8-45 లు; పెంచిన తర్వాత రూ 10-01 లు మద్రాసులో పెరిగినతర్వాత ధర రూ 8-98 లు. అంటే మద్రాసుకంటే నెల్లూరు లీటరు పెట్రోలు ధర 103 పైసలు ఎక్కువన్నమాట!

పెట్రోలు మధ్యతరగతి వారికి అందుబాటు కాకుండా, దాన్ని పెద్దవారి సొత్తు చేయడం అన్యాయం. ప్రధాని ఈ పొరపాటును ఇప్పటికైనా సవరించుకోవడం బాగుంటుంది.

రాజీవ్‌గాంధీ పెంచాడుకాబట్టి తాను తగ్గించాననిపించుకోవడానికి ముఖ్యమంత్రి రామారావుగారు తాను ఆటోలు, స్కూటర్లకు లీటరుకు ఒకరూపాయి తగ్గించాను పొమ్మన్నారు! కానిఈతగ్గించినరూపాయి ఆరునెలల క్రితం తాను అదనంగా వడ్డించిందేననేది ప్రజలు మరచిపోయివుంటారనుకున్నారు ఆయన!

### మరణం

జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారిగా రిటైరైన డాక్టరు జె శేషాద్రిరెడ్డి (67) 11 తేది గుండెపోటుతో మరణించారు.

ఆయన సతీమణి యశోధర. ఆయన కుమారుడు ఒకోకగారలుకూడా డాక్టర్లు. అంతేగాదు డాక్టర్ దిలీప్ ఆయన బావమరిది; డాక్టర్ అరుంధతి ఆయనతదిన; వింధ్యావళి (డాక్టరు జె శేషారెడ్డి సతీమణి) ఆయన మరదలు.

డాక్టర్ శేషాద్రి వివాదరహితుడు; మంచివాడు. ఆయన కుటుంబానికి ఆప్తబంధువర్గానికి మా సానుభూతి.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు (9672) | | |
| .. | పాతవి | 2000-00 |
| .. | కొత్తవి | 1600-00 |
| మసూరి | (కొత్తవి) | 1600-00 |
| ఐ ఆర్. 20 | | 1850-00 |

### రామానుజన్

(2 వ పేజీ కొరవ)

వాన రామానుజన్‌కి పరిచయం చేశారు. వారి సహాయంతో మద్రాసు పోర్టు ట్రస్టులోని అకౌంట్సు విభాగంలో గుమాస్తాగా రు 25/-ల నెలసరి వేతనంమీద, 1-3-1912 నుండి 30-4-1913 వరకు పనిచేశారు. ఆ తర్వాత ప్రసిద్ధ బ్రిటీషు గణితశాస్త్రవేత్త జి. హెచ్. హార్డీ, శ్రీనివాస రామానుజాన్ని - ఆయన మేధాశక్తిని గుర్తించి 1913 లో కేంబ్రిడ్జి యూనివర్సిటీకి తీసుకవెళ్ళారు.

దివాన్ బహదూర్ రామచంద్రరావు గారు శ్రీనివాస రామానుజాన్ని గురించి ఇట్లా వ్రాసారు.

"Several years ago, a nephew of mine perfectly innocent of mathematical knowledge spoke to me" uncle, I have a visitor who talks Mathematics. I do not understand him; can you see if there is anything in his talk". And in the plentitude of my mathematical wisdom, I condescended to permit Ramanujam to walk into my presence. A short uncouth figure, stout, unshaved, not over clean, with one conspicious. Feature sheding eyes, walke ind with a frayed note Book under his arm. He was miserably poor. He had run away from Kumbakonam to get lisence in Madras to pursue his studies. He never craved for any distinction. He wanted leisure.in other words simple food to be provided for him without exertion on his part and that he should be allowed to dream on. When he began to explain some of his discoveries from his note books, my knowledge did not permit me to judge whether he talked sense or nonsense. Suspending judgement, I asked him to come over again, he did. He had gauged my ignorance, and showed me some of his simpler resuIts. I asked him what he wanted a pittanse to live on so that he might pursue his reserches.It is a matter of considerable pride to me that I was in some way useful to his remarkable genius in his early days"

శ్రీనివాస రామానుజన్, పైథాగరస్, బ్రహ్మగుప్తుడు, భాస్కరాచార్య-1, భాస్కరాచార్య-2 వంటి గణితశాస్త్ర నృతులతో పోల్చదగిన ఈ శతాబ్దపు గణిత విజ్ఞానఖనియని భావించడంలో అతిశయోక్తిలేదు.

1908 సం॥లో నిర్మించినసెటి కలెక్టర్‌వారి కార్యాలయ భవనంలోనికి 1911 సం॥లో, శ్రీనివాసరామానుజన్ నెల్లూరువచ్చి శ్రీ రామచంద్రరావుగారిని (కలెక్టరు) కలుసుకొన్నారు. అప్పటి శ్రీనివాస రామానుజన్ పాదముద్రలు యింతకాలమైనా ఆ కార్యాలయపు మెట్లపై అట్టడుగున నిద్రిస్తున్నవేమో నన్న విశ్వాసము నాకువుంది.

నెల్లూరులో శ్రీనివాసరామానుజన్ శతజయంతి ఉత్సవాలు జరుపడం; కలెక్టరు వారి కార్యాలయంలో వారి విగ్రహాన్ని ప్రతిష్ఠించడం – ఎంతో సముచితంగా వుంటుంది. ★

హైదరాబాదు నగరంలో కొత్తగా ఏర్పడిన సింహపురి అసోసియేషన్ సాంస్కృతి కోత్సవాల సందర్భంలో ప్రసంగిస్తున్న మాజీ రెవిన్యూమంత్రి జనార్ధనరెడ్డి; వేదికమీద కూర్చున్నవారు ఎడమనుండి-అసోసియేషన్ అధ్యక్షుడు ఎల్. వి. కృష్ణారెడ్డి, డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు, జస్టిస్ ఎ. గంగాధరరావు.

### మొదటిపేజీ కొరవ

లాల పునర్వ్యవస్థీకరణవంటి విధాన నిర్ణయాలుకూడా ఎన్నికల ప్రచార నిబంధనలకు విరుద్ధంగా, ప్రభుత్వం తరఫున తానే ప్రకటిస్తున్నాడు. దావో, బ్రతుకో తేల్చుకోవాలనే పట్టుదల వారిలో కన్పిస్తున్నది.

కాళహస్తిలో తెలుగుదేశం విజయం సాధిస్తే మాత్రం అసెంబ్లీ రద్దు నిర్ణయం దాదాపు ఖాయంగా భావించవచ్చు ఎన్నికల ముహూర్త నిర్ణయమే మిగిలివుంటుంది. అక్కడ అదృష్టం తిరగబడితే అందరూ తేలుకుట్టిన దొంగలవలె గప్‌చిప్‌అయిపోయి, మరికొంతకాలం వేచి చూచే అవకాశం వుంది. ★







Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, Nellore-524001